శ్రీ

# భావనారాయణ శతకము.

ఇది

తురగా వేంకటాచలము పంతులు, బి. ఏ., గారిచే

రచింపఁబడి

కే. వి. కృష్ణారావుచే

గుంటూరు

వాణీముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది.

1911.

వెల రు 0-1-0.

# ఉపోద్ఘాతము.

ఆర్యులారా,

శ్రీ పొన్నూరి భావనారాయణక్షేత్రమాహాత్మ్య మాంధ్రీకరించుటకు శ్రీ తురగా వెంకటాచలము బియేగారు శ్రీ భావనారాయణస్వామివారి ధర్మకర్త్రిగారగు రాజా వాసిరెడ్డి వేంకటలక్ష్మీనరసమాంబా రాజ్ఞీ బహద్దర్ మన్నెసుల్తానుగారిచే ప్రార్థితులై, యాయాంధ్రీకరణంబునందు నేబదిపద్యములను మాత్రమే రచియించిరి. పిమ్మట శ్రీ బియేగారు తమశరీర మారోగ్యశూన్యంబగుడు నిక్కార్యము నెరవేరదని యెంచి కాంబోలు నెటులైన శ్రీ భావనారాయణస్వామివిషయక గ్రంధరచనచే దమజన్మను సార్థకముగావింపనెంచి యీభావనారాయణశతకమును కొన్నికీర్తనలను వ్రాసిరని తోచుచున్నది. దీనిలోని కొన్నిపద్యములవలన శ్రీ బియేగారు రోగబాధచే మిగుల నాయాసపడుచున్న సమయముననే యైహికాముష్మికసాధనముగున నీగ్రంధమును రచించిరని కన్పట్టుచున్నది

వీరిపుస్తకమును చిత్తువ్రాతలోనుండి తొలఁగించి శుద్ధప్రతిగా వ్రాయునంతటి యవకాశము లేకయే బియేగారు స్వర్గమలంకరించిరి గాన, దానిని సరిచేయుభారము నాయందుంచఁ

బడెను. నేనుం జిత్తుచు సాఫుఁజేసికొనిగాని వారిప్రయోగములం దు నూటఁదొంబదితొమ్మిదిపాళ్లుమార్చలేదు. వారిప్రయోగములను బహుగ్రంథద్రష్టలగు చదువరులే సమన్వయించికొనం దురుగాత.

ఇట్లు భవద్విధేయమిత్రము,

శతావధాని, కాశీ కృష్ణాచార్యులు.

# పీఠిక

శ్రీ హిజ్ యెక్సలెన్సి సర్ ఆర్థర్ లాలీ ప్రభువుగారు 1908 సం॥రం డిశంబరు నెలలో గుంటూరుపట్టణమునకు విచ్చేసి నప్పుడు తదాగమన గౌరవసూచకముగా నప్పటి మండలాధికా రియగు శ్రీ బ్రాడీదొరవారిచే స్వర్ణపతకము బహుమానముం చిన రాజమహేంద్రవర పురనివాసియు నస్మచ్ఛ్రేయోభిలాషి యుం గవివర్యుండును నగు బ్ర॥ మ॥ శ్రీ॥ వడ్డాది సుబ్బారాయ నిగారికిఁబలె నాకును గౌరవము జరుపఁబడుటకై నిరుత్సాహము నొందిన యస్మత్పరమాప్తుండును న్యాయవాదియు గుంటూరు వాస్తవ్యుండును నగు మహారాజశ్రీ న్యాపతి హనుమంతరావు పంతులుగారే యమితప్రోత్సాహ మీగ్రంథము వెలువడుట కు ముఖ్యకారణమయ్యె. పైఁజెప్పిన బ్రాడీదొరగారి సన్మానసభావసానమున నే నాచే దైవభక్తియను గ్రంథ మొకటి ని ర్మింపఁజేయుఁదలంచి తరుణమున నే పంతులుగారు తమయభిప్రా యమును నాకు వెలిపుచ్చిరిగాని సాధనాభావము చేతను మఱి కొన్ని కారణములచేతను నివిషయమం దెంత ప్రోత్సాహము వారికున్నను గ్రంథప్రారంభమునకె యొకసంవత్సరము పైవర కు వలనుపడినది కాదు. పంతులవారు బాపట్లతాలూకా పొ న్నూరునందు వెంచేసియున్న శ్రీ భావనారాయణస్వామి దేవ స్థాన ధర్మకర్తలును పారమార్థికచింతగలవారును మాన్య

లును నగు శ్రీరాజా వాశిరెడ్డి వెంకటలక్ష్మీనరసమాంబారాజ్ఞి గారికి నేతత్కార్యనిర్వాహకమునఁ బ్రతినిధులుగా నుండుటం జేసి తద్దేవస్థాన స్థలపురాణమునకు నాంధ్రీకరణము భావనారాయణశతకమును గీర్తనలును నాచేఁ జేయింపదలంచి సరసమతులగు శ్రీరాజ్ఞీగారి యంగీకారపత్రికను జాలకాలముక్రిందటనే పడసియున్నను స్థలపురాణమాతృక యలభ్యమగుటం జేసి పెక్కుమాసము లట్లుగడచిపోయెను. ఈమధ్యకాలములో నాకును శ్రీరాజ్ఞిసోదరులును ప్రొబేషనరీ డిప్యూటి తహశ్శీలుదారుగారును నగు శ్రీ చిరుమామిళ్ళ లక్ష్మీనారాయణప్రసాదము బియేగారికిని గాకతాళీన్యాయముగా గుంటూరుపురమున దైవప్రేరణమున లభించిన పరిచయస్నేహఫలముగా వారు నాచే వ్రాయించి ముద్రింపించిన శ్రీ సరోజినీనాటకమును గన్నులారఁజూచియానందించినతోడనె పంతులవారికిని శ్రీరాజ్ఞి గారికిని వారి జ్యేష్ఠసోదరులును భగవద్భక్తులునగు శ్రీ చిరుమామిళ్ళ భానుప్రసాదముగారికిని శ్రీ భావనారాయణ స్థలపురాణము నాచే నాంధ్రీకరణముచేయింపవలయునను కుతూహలమినుమడించెను. తత్కార్యనిర్వహణార్థమై శ్రీపంతులవారు గడచిన ఫాల్గుణమాసమునం దొకశుభదినమున నన్ను కొరిటెపాడు వనభవనంబుననున్న శ్రీరాజ్ఞిగారి దర్శనమునకు సగౌరవముగాఁ దోడ్కొనిపోయి యస్మత్కృతగ్రంథములనుండి కొన్నిపద్యములను నాచే వారికి వినిపింపఁజేసి యామోదముకలిగించి శ్రీ భావనారాయణ స్థలపురాణాంధ్రీకరణశతకములను గీర్తనలును చేయుడని వారిచే నన్నుఁగోరఁగాఁజేసి వారిసోదర

రత్నమగు భానుప్రసాదముగారిచే సకర్పూరతాంబూలము నిప్పించిరి. శ్రీపంతులవారి యాద్యవాంఛాంకురమునకు వారె యిట్లు దోహదముకల్పించుకొని కట్టకడకు ఫలములు నాచేబండింపఁజేయించిరి. ఇప్పుడు నేను బ్రపంచానుభవమునకు వ్యాప్తము జేయఁ బ్రచురింపఁదలఁచిన పద్యఫలములు స్వాదనీయములో తిక్తములో యామ్లములో పఠనానుభవశాలురే విశదీకరింప వలసియున్నది.

తురగా వేంకటాచలము,

గ్రంథకర్త.

ఇట్టి పుణ్యక్షేత్ర సంబంధమగు నీ గ్రంధరచనానంతరము నాపరమమిత్రులగు నీ వేంకటాచలం పంతులుగారు పరమపదము జెందినందున అముద్రితస్థితియందుండిన నిది ప్రపంచమునకంత ప్రయోజనకారిగి నుండఁజాలదను తలంపుచే దీనినిముద్రణము జేయించి ప్రచురపరచితిని.

గుంటూరు. చిరుమామిళ్ళ నారాయణప్రసాద్, బి. యే.,

ప్రా॥ డి॥ తహశ్శీల్దారు.

మ. దొరలన్ లెంకల దాతలన్ లుబ్ధులను సాధుశ్రేణి దుర్మార్గులన్
స్ఫురదాకారుల రూపహీనులను జ్ఞానుల్ మూర్ఖుల న్నీవిలా
సరుచిం జిత్రపుఁ దోలుబొమ్మలుగ నిచ్చల్ సేసి యాడింతు న
వ్యక్తశ్రీన్నాటకసూత్రధారివలె దేవా భావనారాయణా. ౫

మ. కనులం జూడఁగ రావటంచు మది నజ్ఞానావృతుల్ నాస్తియం
చనఁగాఁ జూతురు హేమకశ్యపుని సాక్ష్యం బొక్కటే చాలదే
యనఘా, దీనికి సూక్ష్మవస్తువులయందైనం గనంజాలు నీ
యునికిన్ స్థూలశరీరు లేలగనరో కో భావనారాయణా. ౬

మ. శిలయందుండును దారువందుఁ గలఁడే చిజ్జ్యోతి నారాయణుం
డలతామ్రంబున వెల్గునే యనుచు శుద్ధాజ్ఞానతం బల్కు ప
ల్కుల నాలించినఁ గర్ణశూలములటుల్ దోఁచుంగదా విగ్రహం
బులెగా నిశ్చలబుద్ధిఁ గూర్చు కరణంబుల్ భావనారాయణా. ౭

మ. ఘటమందున్ మఠమందు గోపురమునం గాన్పించి యాకాశ మొ
క్కటె భిన్నాభిధలొందునట్లె మతిసంకల్పంబునం దేహసం
ఘటితంబై పరమాత్మ యాకృతుల లెక్కల్లేక తాఁ దాల్చియు
త్కటనామంబులు పెక్కులొందెడును గాదా భావనారాయణా. ౮

శా. నీరూపంబు భజించి యుక్తవిధుల న్నీకర్చనల్సల్పి చే
తోరాజీవమునందు భక్తిని సంతోషంబుతో నిల్పి యా
త్మారామున్గనఁజాలు భక్తునికి దివ్యానందకల్యాణశో
భారమ్యంబగు జ్యోతి కన్పడదె దేవా భావనారాయణా. ౯

మ. తనబిడ్డల్ స్వకదత్తభక్ష్యముల నాస్థం జేతికందీయఁగా
గొనకుండొల్లకమంగి నానినుల స్సంతృప్తిఁ బుత్రాళికే

తినుమంచుం దయసేయునట్టు లతిభక్తిన్నీకు నర్పించునీ
ధనముల్మ్రొక్కెదుసంగ దర్మ్మలి ననన్తా భావనారాయణా. ౧౦

మ. గుణిధ్యానుష్కృఁదు నిల్పనోపును మొదలొక్కన్నాళ్లు తాఁడేనినో
స్థిరలక్ష్యంబునకుఁ ఘటింపుకొని దృష్టిం బెట్టుకోకున్న న
క్షరకాన్యాందు పఠింపఁగాఁగలఁడె సద్గ్రంథంబు నీరూపమా
పరజిహ్వన్గనఁజేయుసాధనము శ్రీశా భావనారాయణా. ౧౧

శా. ఆకాశంబనుకప్పుకప్పితివి బ్రహ్మాండంబునీయింటికిన్
జీకట్లంతటఁబర్వనైలైడల వానింబాపనాకప్పులోన్
వీకన్నిస్తులకాచఖండముయను న్నిర్మించినావోచునన్
నాకుందోఁచెడు సూర్యచంద్రభములన్నా భావనారాయణా. ౧౨

మ. పొరపాటుల్గనలేము నీసృజనలోఁ బూర్వాపరంబుల్ సహా
నగహీన్ సాగరసాలవృక్షమునకెన్నన్ దత్ఫలశ్రేణియే
పెరుగున్నాని మఱిందుఁగల్గునొకో యుర్వీజంబు వెన్కన్పల్లో
త్కరముల్మందునుగల్గునే భువి ననన్తా భావనారాయణా. ౧౩

మ. దళమందున్విడు నీవెయీనెకును మధ్యస్థానముల్పాటిగాఁ
గొలతన్గొల్చుచుఁదీర్చినట్లైసఁగు నాకుల్రెండుమూఁడెన్ని రె
మ్మలకుండన్వలె నన్నియేపడను నీమాయావిలాసాళిచే
చలనన్ వ్యత్యయమింతలేదుగద దేవా భావనారాయణా. ౧౪

మ. కడుపుందీపికి సాటిలేదుగద లోకంబందునోతండ్రి నీ
బుడుతల్ దైన్యపరీతులైన నవిసవ్మోద్దంబు నీకెట్లగున్
జడతంబల్కినఁ గొండలట్టులు మనస్తాపంబుచేదంద్రిదా
నడరింపన్నిరసించు పుత్రకులుతేరా భావనారాయణా. ౧౫

శా. నిన్నుం బోలెడు సద్గురుండు పితయున్ నిర్జేతయున్ రాజునా
పన్నత్రాణుఁడు నాత్మబంధువుఁడు సంభావ్యుండు జ్ఞానైక సం
పన్నుండున్ గృతకృత్యుఁ డూర్జితుఁడ యావారాశి యీశ్వము
దున్నాఁడా నసుఁగన్న తండ్రి సతబంధూ భావనారాయణా. ౧౬

మ. తనదండింపఁగ మాతతండ్రి మొదికాస్థన్ బాలు పిడ్డంపఁటన్
జనకుండేయదలించినన్ బెదరి యాసన్ మాతనుం జేరునన్
ననలం జేసిన నన్నుఁ డొండుఁగలఁడే కాదంచు బ్రోవంగ నుం
డిన రక్షించిన నీవెదిక్కుగద తండ్రీ భావనారాయణా. ౧౭

మ. పురుషార్థంబులలోన శాశ్వతమునాఁ బోల్పంగు మోక్షంబు; సు
స్థిరమా దానిఁ ద్యజించి యేమికతనో చిత్తంబు నేమాత్రయున్
స్థిరమంచున్ దలపోసి దాని నెసగా చెందంగ యత్నించమనీ
శా పాటున్ గరుణించి దిద్దవె స్వయంభూ! భావనారాయణా. ౧౮

మ. అనఘా కాంతిసమావృతంబుగద బాహ్యవ్యాప్తలోకంబు నా
కనుదమ్ముల్ వికసింపఁజేయుతరి విజ్ఞానాఢ్య నాకెట్లు సం
జననంబయ్యెదు జ్ఞాననేత్రము భవత్స్వాధీనమైయుండఁగా
నిను బ్రార్థించెదఁ దెల్పికన్నుఁ గనఁగ తండ్రీ భావనారాయణా ౧౯

మ. అపచారంబులు నీదుభక్తులకుఁ జేయు న్మూర్ఖులే వేనియున్
గుపితత్వంబున వారిఁ జెండెదవు నీకున్ భక్తులన్నేనిఁ బా
మపచారంబులొనర్చినన్ నగవుతో హాపణంబుతోఁ గొందవా
ర్యపితా, యాశ్రితపక్షపాతివిగదయ్యా భావనారాయణా ౨౦

మ. జలశుష్కంబయినన్న గిల్లు బిదపన్సాంద్రంబుగా వాహినుల్
చలదుత్తుంగతరంగసంకలితమై సంపూర్ణతన్ గాలున

మ. నినువెన్నుండనుమర్త్యవట్టిసుజను న్నియంతసన్మూర్తిగా
ననఘా, చేయుదువమ్మ సేవిని భవద్వ్యాపారలీలారతిన్
దినము న్నేగడుపంగఁజూడ మతిహానిన్ విఘ్నముంజేయు ప్రో
వనె యెల్లప్పుడుఁజూచుచుండుగద దేవా భావనారాయణా. ౨౭

మ. ఎవరున్నారికి నిన్నుఁ బ్రోచుటకు నేనేకావెదిక్రించుఁ బ్రా
భవమున్నాని యగమ్యదేశములఁ గన్నాపన్నన్నాని రూ
పవిలాసంబున దాల్చి బిగ్గఱగఁబిల్వన్ మాఱుమాటాడకే
యవమానంబును నాకుఁజేయఁ దగునయ్యా భావనారాయణా. ౨౮

మ. సుకముంబొందెడువేళఁగూడ నకటా సుంతైనమార్గణంబుమా
మకచిత్తంబున నుండనోపదుమహాత్మా భావిసంప్రాప్యదుః
ఖకరాశిద్విపిదంష్ట్రిలాసఁదను ప్రింగంజూమనవ్వేళఁ బ్రా
పక మేమంచును నిప్పుడేవెఱచు దేవా భావనారాయణా ౨౯

శా. బీజంబుల్ధరనాటినావు పిదపన్ వృష్టిన్సకాలంబులో
రాజిల్లన్దయచేసినావు దయివారం దేజమున్వాయువా
పైఁజక్రంగనుగూర్చినావు ఫలముల్ భక్షింపమాత్రోడ ని
ర్వ్యాజానందతఁజెప్పినావుగద దేవా భావనారాయణా. ౩౦

శా. నీకారుణ్యముగోరి భక్తులెపుడు న్వేధింపనీయుండవున్
రాకుండన్జలశాబ్ధిలోన గరళోగ్రవ్యాళతల్పంబునన్
జోకన్నిద్దురవోయిన న్విడుతురే శోధించినిన్బిల్వఁగా
రావన్నావె గజేంద్రుఁబ్రోవ నఘదూరా భావనారాయణా. ౩౧

మ. చిలువన్బట్టి విసంపుఁగోఱలను ముచ్ఛేదించి నాగస్వరం
బుల నుల్లాసము పెంచి సర్పగుఁ డహంబున్ దానినాడించు న్నో

జలసత్త్వమను ద్వేషరాగ మదమాత్సర్యంబులం ద్రెంపి ని
చ్చలు నానందతం దేల్పవే ననురమేశా భావనారాయణా. 3౨

శా. స్నానం బాడ ముదంబు గొల్పు నదిలోనన్ డిగ్గి యీలాడఁ బా
టీవ గ్రాహములందు స్నాతఁ గని ధాటిన్రేగుచున్మ్రింగు న
ల్లే నీపూత మెఱుంగు సంసృతిసుఖం బేకోరరాగాదుల
య్యాసన్ బట్టెడు బాధఁ బాపవె మహాత్మా భావనారాయణా. 33

మ. ఘనకార్యాతురతం దనూజుఁడు వియోగం బొంది పెక్కేండ్లకున్
జనకున్ జూడఁ బరస్పరంబుగ నులన్ జాఱు నవోష్ణాంబువుల్
గనవా దుఃఖము ముందు సంతసము వెన్కన్ దోఁచు నే నాఁటికే
న్నినుఁ జూడన్మనకట్టులేజరగుఁ దండ్రీ భావనారాయణా. 3౪

మ. ఎలనవ్వుల్ మృదుభాషణల్ సుమతనూ హేమాభ వాల్చూపులున్
జిలుగుం బయ్యెద సోగకుంతలములున్ జెన్నారశంపాంగి పెన్
వలపుం జిల్కుటఁ జూచి మైమఱచి యజ్ఞానాత్మినన్ గోరు దు
ర్బలుఁ డెట్టుల్ గననేర్చు నిన్ను నఘదూరా భావనారాయణా. 3౫

మ. కనకంపుం గనులెన్నొ చూపఱ కలంకారంబు గాఁ దాల్చి మే
దిని కాపైనను స్వోపయోగమున కాప్తిన్ దీయనట్టీ జడుల్
ధనమార్జించి రవంతయున్ దినక నిద్రాభుక్తులన్ మాని దా
నినిఁ బోషింతురు లోభ మెట్టిదియొ తండ్రీ భావనారాయణా. 3౬

మ. అతిశాంతాత్ములు జ్ఞానవంతులని ప్రఖ్యాతిన్ ధరం గాంచి దు
ర్మతి స్వాన్యాంతగముల్ గణింపక మహారౌద్రంబునన్ గ్రోధనుల్
వెతఁ గల్పింతు రొకప్పు డన్యులకుఁ దాల్మిన్ జ్ఞానమున్ వీడి యీ
పతితుల్ నీకృపఁ గాంచు టెట్టులిక దేవా భావనారాయణా. 3౭

ప్పపరుండో పరమాత్ముపుత్రుఁడగు జీవుండామనస్సంగతిన్
జపలుంగ్రైనిఁజేరుఁ గట్టకడకీశా భావనారాయణా. ౪౩

మ. యశముల్ వంశవిభూషణత్వము విద్యాస్వాపతేయంబులున్
విశదానందముగల్గువారిఁగని గ్లానింబొంది లోఁగుందుచ
న్నశుభద్వేషులు పల్వురుందురుగదా యవ్వారుత్త్వేవరున్
వశులై యెట్టులనిన్నుఁగాంచెదరు దేవాభావనారాయణా. ౪౪

మ. దినముల్ బత్రము లెప్పపాటుననుఁబంక్తిన్ వ్రాసి పూరించు ఓ
వనచారిత్రము నీవిమర్శనముఁ దెల్పంగోరియర్పింతురీ
జనులంతంబునఁ బక్షపాతరహితస్వాంతంబునన్ నీవుతీ
ర్చినతీర్పే యనుబంధమైనిలుచుఁ బేర్మిన్ భావనారాయణా. ౪౫

మ. ప్రకృతిన్ బుష్పఫలావృతంబయిన భూభాగంబుదర్శించు కం
టికి నానందము మెండు కంటకితవాటిన్ జూడఁగానోచు న
క్షికి సంతోషము మెండు సద్గుణవిరాజిన్ జూడ హర్షంబు పా
తకునిన్ జూడ నపహ్యమల్లెగద పూతా భావనారాయణా. ౪౬

మ. జలబాష్పంబులు మేఘమై చినుకులై జాలై తటాకంబులై
లలితద్వీపవతీమతల్లులయి కల్పస్థాయులై యొప్పున
ట్టులు పుణ్యాత్ముల ధర్మవృత్తగతు లెప్డున్ వర్ధమానంబులై
ప్రళయంబందునఁగూడవెల్గుఁగద దేవాభావనారాయణా. ౪౭

శా. ధేనూత్తంసము సత్సరోపకృతి నెంతేఁజేయుననంచెంచియే
దానింజూచినమస్కరింతురయ పవిత్రంబంచుఁ దామెప్పుడున్
బ్రాణాపాయమెనేయుననంచుఁగద చంపన్ జూచెదర్ భేదమె
ద్దానన్ సజ్జనదుర్జనాళికిదెగాదా భావనారాయణా. ౪౮

మ. వరకాంతాకనకంబులున్ బ్రణుతదివ్యప్రాభవంబుల్లటా
యురిదీయంబదువానికెలయవి యాయుర్వృద్ధిచేకూర్చునే
నరజన్మంబును నుత్తమోత్తమమును నాకిచ్చినావైననా
మరణాయాసముదీర్చునేయది మహాత్మా భావనారాయణా. ౪౯

మ. భవబాధల్ పదిసార్లు జంతునరగర్భశ్రేణిగన్నట్టినీ
కవచూర్ణంబెకదా! మఱిన్ దెలుపవేలా! దానినేనిచ్చలున్
భవదీర్ఘామయవైద్యుఁడీవెయని చెప్పన్వించు నాజన్మపుం
దెవులున్ బాపఁగనిన్నుఁగోరెదను నర్థిన్ భావనారాయణా. ౫౦

మ. నియతంబైన త్వదీయధర్మపథుల దేనిన్ మీఱినన్ బాపమున్
భయయోగంబునఁగాదె జ్ఞానులకుఁ బ్రాప్తంబౌను సారూప్యమా
రయ దీనిన్ వెలిజేయఁజూపితివి తారార్కాణంబుపుర్వుల్ మహా
భయయోగంబున బంధరంబులకుఁ దేవా భావనారాయణా. ౫౧

మ. భువి ద్రవ్యార్థ్యుఁడొకందు మంచిదుబుసంబుల్ దాల్చు సద్వాంఛతో
వివిధక్షేమము లర్థ్యయంత్రమును దెల్విన్ గట్టువిన్నాణము
త్సవతన్ జేదమఁజూపులీలఁ బలుకుల్ సందస్సునుంగైతనీ
స్తవముంగోరుచు నాకొసంగితివె యీశాభావనారాయణా. ౫౨

మ. రవితేజంబొకటైన నద్దములనీరంబందు సంపాతమై
మివులన్ దేజముఁదోపులీల నమలామేయప్రభావాఢ్యమా
భవదుద్యద్ఘనకాంతి స్వచ్ఛతమజీవశ్రేణిబింబించి ది
వ్యవికాసంబును వెల్లడించుఁగద దేవా భావనారాయణా. ౫3

మ. తనపైవాని మనుష్యమాత్రకునె సందర్శింపసద్వస్త్రముల్
వినయంబున్ సముయంబవశ్యములగున్ విశ్వాధికారిన్ ఘనున్

నినుదర్శింపఁగ బాహ్యవేషములు తంత్రీముఖ్యముల్ గావు పా
వనచిత్తంబొకటేయవశ్యమగు దేవా భావనారాయణా. ౫౪

మ అలఘుప్రాభవమూని నేర్పున భవిష్యత్కార్యముల్ తత్ఫలం
బులు మాబుద్ధికిదాఁచినాఁడ వవియే బోధ్యంబులో నేని మే
ము లవంబున్ గృషి సేయనొల్లముగదా భూజాళికిన్ మాకు నా
వల భేదంబొకయింతలేదుగద దేవా భావనారాయణా. ౫౫

మ. తనవారున్ బెఱవారలంచు బహుధాతర్కించివర్తించు నా
మనమెల్లప్పుడు బిడ్డలేగద తలంపన్ వారు నీకందఱున్
ఘనమాయాజననీప్రభావమున నేకత్వంబు భిన్నంబులై
కనుపట్టున్ సకలంబు నీకొకటెయౌఁగా భావనారాయణా. ౫౬

మ. కణజంబందున ధాన్యముల్ గలజనుల్ క్షామంబుగీమంబునన్
గణుతిన్ జేయుదురే పరాత్పర! భవత్కల్యాణశృంగారస
ద్గుణభావార్జితపుణ్యలేశములు సంతోషించియానందమొం
దునరుం డైహికకష్టమెంచునె సుబంధూ భావనారాయణా. ౫౭

మ. మనమన్ సారథి మోహలోభమదకామక్రోధమాత్సర్య చ
క్రనియోగంబయి వాంఛనాఁబడు శతాంగంబెక్కి త్రైగుణ్యమన్
గుణముల్ బారులుదీర్చి యింద్రియములన్ గుఱ్ఱాల్ వడిన్ లాగఁదో
లును ధర్మానువులూడఁజూడఁడు కృపాళో భావనారాయణా. ౫౮

మ. అనలస్పృష్టగృహస్థులైన ధన భార్యాపుత్రులన్ వీడుచున్
దనతాపోపశమంబుఁగోరి వెలికంతన్ వచ్చు భర్తంబలెన్
ఘనదుఃఖావృతసంసృతిన్ దొలఁగఁగాఁ గాంక్షించియుందున్న నీ
షణముల్ మాఁటిఁద్యజింపఁగోరెద రమేశా భావనారాయణా॥ ౫౯

మ. అరిషడ్వర్గము నాఁగ నొప్పు భయదవ్యాఘ్రంపుగుంపుల్ మహా
తురతన్ ముక్తిధనంపుఁ బేటికినిఁ దోడ్తోఁ గావలిం బెట్టినా
వరయన్ దానినిద్రుంచినంగద నరుండందున్ దదర్ధంబునీ
కరుణాసిన్ గొనవేనిఁ జెందు మృగధాకన్ భావనారాయణా. ౬౦

మ. పుడమిన్ స్వల్పవిభాగమేలు ప్రభువే పొందున్ మనఃక్లేశమె
ప్పుడు; హద్దుల్ గనఁజాలనట్టి భువనంబుల్ లెక్కపద్నాల్గునే
లెడు దివ్యప్రభువైన నీవుపడు హృత్క్లేశంబు వర్ణింప మం
దుఁడనా కాని సతంబు నివ్వెఱను గందున్ భావనారాయణా॥ ౬౧

శా. నానాస్థావరజంగమంబులను నున్నావంచుఁ దెల్పంగ ను
జ్ఞానుల్ వేముఁ దురంగముల్ వృషభ మశ్వత్థంబు సర్పంబునున్
ధేనూత్తంసము నాదిగాఁ గలుగువానిన్ భక్తిమైనిచ్చలున్
ధ్యానాధిక్యతఁ బూజసేయుదురనంతా భావనారాయణా. ౬౨

మ. రవిభాసిల్లఁగ నెల్లజంతువులు కార్యవ్యాప్తిమైనుండినన్
రవినింజెందవు తత్ఫలంబు లోకమైనన్ బంచకర్మేంద్రియా
ళి విశేషంబగు నాత్మసన్నిధిని పోలిన్ గర్మముల్ సల్పఁజే
రవుగా తత్ఫలితంబులాత్మ నఘదూరా భావనారాయణా. ౬౩

శా. నారీరత్నము రాజపుత్రి పతి ప్రాణప్రాయయం చెంచకే
కౌరవ్యుల్ సభలోన ద్రౌపదికి నల్కన్ మానభంగంబుగాఁ
జీరల్ విప్పెదు వేళ నాయబల హా శ్రీకృష్ణయంచేడ్వఁగా
ధారాపాతముగాఁగ వల్వలిడలేదా భావనారాయణా. ౬౪

మ. వటుప్రాయంబునఁ దోఁబరించితిని నన్ వాత్సల్యతన్ బ్రోచునం
చటుకుల్ గానుకగాఁ గుచేలముని నీకర్పింపఁ బేరానతోఁ

బటుసౌహార్దగుణంబుభాసిలఁగ నాపాలం బ్రసాదించి యా
త్కుటదారిద్ర్యముఁబాపవే విబుధవంద్యా భావనారాయణా. ౬౫

శా. నాతిం బూతనహల్య దుష్టయని లోనం గౌతముం డెంచి య
ఖ్యాతిం బెం శిలగాశపించి యటుపైఁ గామత్సపాదద్వయీ
భూతిం నాతిఁగమారదంచు నుడువం మూర్ఛిల్లి రాయైనయా
నాతిం నాతిఁగఁజేయవే విబుధవంద్యా భావనారాయణా. ౬౬

మ. అపరూపంబసకృద్విలాసము నమేయంబౌ జగన్మోహినీ
చపలాక్ష్యాకృతిఁదాల్చి నివ్వాఁబలాశశ్రేణిముగ్ధంగ న
త్కృప నింద్రాదులకుం సుధాశనముఁ దృప్తింగూర్చి దైత్యాళికిం
విపులార్తిం ఘటియింపఁజేయవె కృపాబ్ధీ భావనారాయణా. ౬౭

శా. వేదప్రాపకము ల్బరోపకృతి గర్విష్ఠారిసంహారమ
ర్యాదం స్వాశ్రితపాలనంబు విబుధాహ్లాదంబు పిత్రార్చనల్
సోదర్యాప్తియు శౌర్యముం విరతిఁ ద్వత్పూనుల్ రహిన్నేర్వఁగా
నోదేవా యవతారధారివయినావో భావనారాయణా ౬౮

శా. సేవావృత్తియె యాదిఁగష్టమటుపై సేవ్యుండుసంద్వృశ్యుఁడై
భావంబుల్వాలిఁబుచ్చకున్న మఱియుం భారంబెగాదొక్కయే
త్రోవన్బోయిన నేమిచిక్కు యటునం దుల్యుండు నీకెందునుం
దేవా లేఁడనినిన్నుఁగొల్తు నఘభేదీ భావనారాయణా. ౬౯

శా. ధారాళంబుగ నీదుభక్తుఁడని యాత్మం దోచె నేనిం నిజో
దారత్వంబుఁదలంప కాతిఁ వనధిం దాటింతువయ్యారె దు
ర్వారంబైన రణాంగణంబునను నాపార్థుండు నిస్వేదుఁగా
సారథ్యంబునుజేయలేదె పరమేశా భావనారాయణా. ౭౦

శా. అర్ధాంగిన్ వరసాధ్వి జానకిని మాయావేషతన్ గొన్న ప్ర
త్యర్థిన్ గొల్చినతమ్ముఁడంచనక నిర్వ్యాజంబునన్ వానిదౌ
స్వార్థత్యాగితకున్ విభీషణుని నాప్తశ్రేణిలోఁజేర్చి నీ
వర్థప్రాణములిచ్చి ప్రోవవె మహాత్మా భావనారాయణా. ౨౧

మ. అతులాస్వాదనబుద్ధిమై ఘనరసాలాగ్రంబునుంజేరి మూ
ర్ఖతముండంద ఫలంబులం దినక శాఖాక్రీడచేఁదా నధః
పతనంబొందెడులీల భవ్య నరజన్మంబొంది గర్వించు నా
కతలందేగతియే మొకావవె మహాత్మా భావనారాయణా ౨౨

మ. తనకందున్ బ్రతిలేఁడటంచెగసి యంతర్వ్యాప్తి మృద్భక్షణా
ర్థినియై జాయకుఁగోర్కితీర్చుతమిఁ బృథ్వింజాపఁగాఁజుట్టి దౌ
ష్ట్యనిధానున్ దనుజాగ్రగణ్యుని హిరణ్యాక్షున్ వరాహాంబవై
జనులెల్లన్ గొనియాడఁద్రుంపవె మహేశా భావనారాయణా. ౨౩

మ. హరినీదైవమె స్తంభమందుఁగలఁడే యాతండుచూపింపుమం
చరికృత్యంబున హేమకశ్యపుఁడు ప్రహ్లాదున్ సుతున్ జెండఁగా
నరసింహాకృతిఁదాల్చి స్తంభమునను న్నానంచు నావఁదిశౌ
గ్యరసంబుల్మొలిపించి త్రుంపవెయరిన్ హా భావనారాయణా. ౨౪

మ. జనకాజ్ఞన్ దలఁదాల్చి లక్ష్మణమహీజాతాతృతీయుండవై
వనముల్సేరుటవించు జానకిపయిన్ వాల్లభ్యమున్ బొంది మా
యను నాసాధ్వినిఁగొన్నయట్టి దశమస్తాలంకృతున్ రావణున్
వనధిన్ గట్టివధింపవే రఘుకులాబ్జా భావనారాయణా. ౨౫

మ. బలగర్వాయతతేజుఁడౌ బలిసుపర్వశ్రేష్ఠునింద్రుఁడున్ మహో
త్కలికన్ నాకమునుండితోల నదితీగర్భంబునన్ వామనా

ఖ్యలసద్రూపముఁదాల్చి యాదనుజు యాగంబందుఁ బాదత్రయీ
స్థలమున్ గోరి యడంపవే బలిని నీళాభావనారాయణా॥ ౨౬

మ॥ అరవిందోదరుప్రాపకంబునను శ్రుత్యాచారులై తారకా
సురపుత్రత్రయమున్ సురేశుపయి నీసున్ బూనిబాధింపఁగా
పరబౌద్ధాకృతిఁదాల్చి వేదచయమప్రామాణ్యమంచున్ మహో
ద్ధురతన్ నేరిపి వారిఁగూల్పవె సుబంధూ భావనారాయణా॥ ౨౭

మ॥ తనమాయామతి సోమకాసురుఁడు వేదంబుల్ తానందునో
ద్దను జౌర్యంబునఁ గ్రహించి వెసఁ బాతాళంబునన్ దాఁచుటల్
విని మత్స్యాకృతివౌచు నీవసురునిన్ వేధించి వేదంబులన్
ఘనతన్ బ్రహ్మకొసంగి కావవె యనంతా భావనారాయణా॥ ౨౮

మ॥ సురలున్ దానవులున్ సుధాబ్ధి ఘటిమచ్చోఁ గుండలీరజ్జుచేన్
దఱువన్ మంథర మంథసాధనమునన్ బ్రావిర్భవంబైన ఘో
రగరశ్రేణి కజాండమూఁగుతరిఁ గూర్మంబౌచు నీవంత మం
థరభారంబువహించి ప్రోవవె మహాత్మా భావనారాయణా॥ ౨౯

మ॥ గరువంబెక్కిన పాపభూపతుల శిక్షాపాత్రులంజేయఁగా
దరుణంబంచును భార్గవుండవయి చేతన్ గొడ్డలిన్ బూని నీ
విరువైయొక్కతఱిన్ నృపాలఖలులన్ హింసించి తద్రక్తని
ర్ఝరముల్ భూసతికీవె తర్పణముగా సద్భావనారాయణా॥ ౩౦

మ॥ చిఱునవ్వుల్ వొలుకాడ మోముపయి గజ్జెల్ కాళ్ల ఘల్లుల్లనన్
మఱువున్ జూపి యశోదకున్ వ్రజసతీపుష్పాస్త్రతన్ దాల్చియే
డ్తెఱఁ గంసాదిమహోగ్రరాక్షసుల ధాటిన్ గూల్చి శిష్టాళి హె
చ్చరికన్ బ్రోవవె రాధికారమణ కృష్ణా భావనారాయణా॥ ౩౧

మ॥ కలి రాజ్యాంతమునందుఁబుట్టి మతసాంకర్యంబులున్ జూచి భూ
స్థలిఁ దత్కారకులైన దుష్టులు వినాశంబొంద భూదేవస
త్కులమందున్ జనియించి యశ్వమణిఁదోడ్తోనెక్కి శాతాసిచేన్
బొలియింపన్ గలవాఁడు కల్కివయి జ్ఞానుల్ భావనారాయణా॥ ౭౨

మ॥ కరినాథుండు పిపాసచేతఁ గమలాగారంబునుం జేరి య
క్కరనందున్ జరణంబుఁ బెట్ట ఘననక్రంబొందు దానిన్ మహో
ద్ధురతన్ బట్టఁగఁ గుయ్యొ మొఱ్ఱోయని యెంతో నిన్నుఁ బ్రార్థింప స
త్వర నేతెంచి గజేంద్రుఁ బ్రోచితివి మహాత్మా భావనారాయణా॥ ౭౩

మ॥ వరిణిందప్పినశత్రుఁడైన మదిఁబశ్చాత్తాపమున్ బొంది నీ
శరణంబన్న ననుగ్రహింతువుగదా శాబాను! సీతాసతిన్
న్మరతీవ్రత్వము చేతగానక దురిచ్ఛన్ గోరు కాకాసురున్
శరణార్థిన్ గరుణింపలేదె పరమేశా భావనారాయణా॥ ౭౪

శా॥ నీకారుణ్యముఁగోరి నీపథులనెంతేఁ జేయు వాఁడాప్తుఁడ
దైజకావాప్తిని నిన్నుఁగూలుజడుఁడయ్యా నీకుశత్రుండుగా
నైకాగ్రుండగుటన్ సురారిజుఁడు ప్రహ్లాదుండు నీభక్తుఁడ
స్తోకక్రూరుఁడు వానితండ్రి యరికాదో భావనారాయణా॥ ౭౫

శా॥ ఓకల్యాణగుణార్ణవేటి! సుకృతీ! యోనిత్యసత్యాకృతీ!
యోకారుణ్యమహాపయోధి! వరదా! యోభక్తరక్షామణీ!
యోకాలుష్యవనాగ్నిహోత్ర! యమలా! యోరాజరాజేశ్వరా!
యోకంసాదివిరోధిశిక్షణచణా! యోభావనారాయణా॥ ౭౬

శా॥ కేలునోర్మద్చేద నీకుదాతకును ముక్తిద్రవ్యసంధాతవున్
లోలద్దిక్యకృపాకటాక్షునకుఁ గల్లోలోపమాతిన్ ప్రజా

ఖిలారిష్టభవాబ్ధినాశకుని నాభీరాంగనా నేతనున్
లీలామానవ వేషధారికిని దండ్రీ భావనారాయణా॥ ౨౭

మ॥ ఇఁకనీయైహికబాధలంబడుచు నేనెన్నాళ్లనీకన్నదో
యికి దూరంబుగనుండఁగావలయుఁ దండ్రీ యార్తరక్షుండవన్
ప్రకటఖ్యాతినిఁబొందినాఁడవు ననున్ బాటింపవేనిన్ మహా
త్మకయద్దానికి హానిగల్గుననుకొమ్మా భావనారాయణా॥ ౨౮

మ॥ తనజ్ఞాత్యాప్తగురూత్కరంబునని లోఁ దాఁగూల్పసందేహమున్
గాని తెల్లంబడియున్న పార్థునకు సంకోచంబు నాత్మనంపఁగా
ఘనవైరాగ్యము వర్ణధర్మవిధులన్ జ్ఞానంబునున్ నేర్పియో
యనఘా! గీతలుపన్యసింపవె మహాత్మా! భావనారాయణా॥ ౨౯

మ॥ కురువంశంబు సమూలకంబుగ మహింగూలంగ నాద్రౌణిని
ర్భరరోషంబున బాణ మేయుతరి శాపప్రాప్తులై పాండవుల్
కరుణింపన్నిను వేడ నాశ్రితులకుల్లాసంబుఁ గల్పింప ను
త్తరగర్భస్థుఁబరీక్షితున్ మనుపలేదా భావనారాయణా॥ ౩౦

మ॥ జడులాత్మన్ నినుఁగాంచనోపుదురె సాక్షాత్కారమీవిచ్చినన్
బుడమిన్ స్వోదరపూరణంబునకె యెందున్ వాదుగానిల్లుటన్
నడినిన్ బాండవరాయభారివగుచున్ సందర్శనంబీయ మూ
ఢుఁడు సుయోధనుఁడాత్మనిన్ దలఁచెనో కో భావనారాయణా॥ ౩౧

మ॥ పటునిద్రారతుఁడైనయర్భకుఁడు స్వప్నంబందునుద్వ్యాఘ్రా
త్కటమౌ సర్పముఁగాంచి యుల్కిపడి శోకవ్యాప్తియమ్మాత్రయాలం
బటుపైఁదల్లినిఁబిల్చులీల ఘనమాయామోహ సంసారలం
పటుఁడౌ నేనినుఁబిల్తు బాధగనుపింపన్ భావనారాయణా॥ ౩౨

మ॥ సకలశ్రోతవు సర్వసాక్షివి లసత్సత్యానురూపుండవై
యకలంకా కనుమాటుగొందువుగదా యాగూనుగోవిందసా
ఖ్యకుఁడా మామన్మృషోక్తికిన్ వగచి సాక్ష్యంబీయని న్వేఁడగాఁ
బ్రకటోక్తిన్ నిజమున్ వచింపవె యహా భావనారాయణా॥ ౧౩

మ॥ తనయన్ గాంచిన భాగినేయునకునై తథ్యంబొప్పఁగానిస్తునం
టని గంగానదిలోనమున్గి భవదర్ఘ్యార్ఘంబునంబల్కఁగా
వెనుకన్ శేశవభట్టుపుత్రిఁగని గోవిందుండు నాకవ్వతో
నెనయే యీయనటన్న నీవొసగవే దేవా భావనారాయణా॥ ౧౪

మ॥ శివుఁడేవిష్ణువు విష్ణువేశివుఁడు దృష్టిన్ పేర్మిచ్చోతగ్గింతయున్
దవులంగూడదటన్న ప్రాఁబలుకు సిద్ధాంతంబుగాఁజేయ నా
శివునిన్ సుందరరాజ్యలక్ష్మిఁగొని కాశీన్వేడియే తెంచి మా
భవముల్బాపఁగ నీడఁజేరితివె దేవా భావనారాయణా॥ ౧౫

మ॥ తనువుల్నిత్యముగావు నీమృదుపదధ్యానంబె శశ్వత్సుఖం
బును నాకున్ దయసేయునంచు మదిఁబ్రార్థించిగోరియర్పించితిన్
ఘనభక్తిన్ శతపుష్పమాలిక భవత్కంఠంబునన్ బ్రేమనా
యినతారాబ్జముగా పరింపవె కృపాబ్ధీ భావనారాయణా॥ ౧౬

మ॥ తలిదండ్రుల్సతిసోదరుల్సుతులు నా పుత్రవ్రాతమున్ బాంధవుల్
కలకాలంబు భవత్పదాబ్జయుగమున్ గాఢంబుగాహృత్పథ
స్థలిఁ బూజింపఁగఁజేసి యైహికదురిచ్ఛావల్లులన్ద్రెంపియా
వల సాయుజ్యముఁగూర్పవే కరుణ దేవా భావనారాయణా॥ ౧౭

మ॥ వరసాధారణనామవత్సరములన్ వైశాఖశుక్లంపుభా
స్కరవారంబున సప్తమీతిథి భవత్కల్యాణపద్యంబులీ

సరణిఁ భక్తిముగించినాఁడఁగాని దోషంబున్న మన్నింపవే
తురగావంశజ వేంకటాచల సుబంధూ భావనారాయణా॥

శా॥ ఔరా కాశియదేడ యీజనపదంబో స్వర్ణికాప్రాంతఘో
రారణ్యంబు లవేడ జన్మతనయోద్యన్మజ్జనంబేడ కు
ల్యారంభంబగు తుంగభద్రజలసౌఖ్యంబేడ కల్పించియీ
దారిఁ ద్రొక్కుట భక్తబ్రోచుటకెగాదా భావనారాయణా॥ ౯౯

మ॥ నిరతానందకసద్భవత్పదలసన్నీరేజయుగ్మంబునే
స్మరియింపన్ గరుణింపవయ్య వితతాశాపాశముత్త్రింపినీ
పరిచర్యన్ మతినిల్పవయ్య మరణాపద్వేదనన్మాన్పి శ్రీ
హరికైవల్యము సంగవయ్య పరమాత్మా భావనారాయణా॥ ౧౦౦

మ॥ మతిదెట్టుల్లలపోసినాఁడవు మహాత్మా యన్యుఁడన్ గాను నీ
సుతముఁ నాకెటేఁగింపవచ్చునను బ్రేమన్ జూడఁగావచ్చునీ
స్తుతికిన్ గ్రొత్తను గానుజూమి గతమందున్ భక్తరక్షామణీ
శతకంబున్ రచియింపఁగైకొనవె యీశా భావనారాయణా॥ ౧౦౧

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

# కీర్తనలు.

## (1) కళ్యాణి - అటతాళము.

నారాయణునిఁగనరే । పొన్నూరిభావ । నారాయణునిఁగనరే॥

నారాజముకుటుని। రాజమానదివ్య। రత్నభాసితపద। రాజీవుఁడైనట్టి॥ నా॥

సారవిహీనసం। సారమునందుఁ। జరియించువారల్లరు॥

సారతమజ్ఞాన। సంపాదనారతిఁ। దీరిచి మోక్షా। ధారుఁడైనయట్టి॥ ౧॥

నేరములేమున్నను। నన్నిటిపరి। హరముఁదాఁజేయును॥

క్రూరులవిజ్ఞాన। మూఢులనిరతా। చారులగుపధిసం। చారులకుమియించు॥ నా॥ ౨

జగదేకమోహనుఁడు। సుందరతము। ఖగరాజవాహనుఁడు

నిగమాంతవేద్యుఁడు। నిత్యుఁడనవద్యుఁడు। సుగుణాకరుఁడుదివ్య।
శోభితాంగుఁడునైన॥ నారా॥ ౩

సామగానలోలుఁడు। కృపాళుఁడు। సంతోషశీలుఁడు। సర్వజ్ఞుఁడాఢ్యుఁ
డు। చారుసుందరవల్లి। రాజ్యలక్ష్మీశుఁడు॥ నారా॥ ౪

## (2) శ్రీరాగము - చాపుతాళము

సేవింపరారే- నారాయణు- భావింపరారే

శ్రీవిశ్వేశునిశుద్ధ- చిన్మయమూర్తిని॥ సేవిం॥ ౧

భావజజనకుని- భక్తరక్షకుని-

పావనచరితుని- బహుళావతారుని- భావనారాయణు - భవభయమా
పు - పాపునలుగఁజేసే ప్రార్థించిమొక్కెదరు॥ సేవిం॥ ౨

ఆశలఁదెగఁగోసి- యరిషడ్వర్గముఁ రోసి- యీశుని వెదనూని- యీవఁగా ములమాని- ధీశాలులగుచుము - క్లేశంబడయుటకు - నాసించినిత్యము - నాముహామహాని॥ సేవిం॥ 3

అతఁడేసర్వజ్ఞుఁడు- అతఁడేసర్వసాక్షి- అతఁడేసర్వశక్తి - అతఁడేసర్వంబును- అతఁడుగానిదొకటి- యవనిలేదంచును- మతినెంచియతని- నమస్కృతి గావించి॥ సేవిం॥ ౪

మనపాపములఁదూల్చి- మన్నించునాతఁడు- తనునాశ్రయించిన- జనులనువీడఁడు- కనకాంబరధారి సుందరనిర్మలుఁడతని - నిన్ప్రార్థించుట - మనపని యనినమ్ముచు॥ సేవిం॥ ౫

## (3) బేహాగ్ - ఆదితాళము.

నను బ్రోవ వేలా- నతజనపాలా॥ నను॥

అనయము నీపద వనజములర్చించు॥ నను॥

పాపుఁడ గోపుఁడఁ బగమదుర్మార్గుఁడఁ గాపాడవేయని కాళ్ళను బ్రాలిన॥ నను॥

ప్రహ్లాదనారదవ్యాసాంబరీషుల- నాహ్లాదమునఁ బ్రోచినావని వేడఁగ॥ నను॥

ఎక్కడవిన్నను దిక్కునీవేయని- నొక్కిపల్కఁగ నీమక్కువఁగోరితి॥ న

గూనిగోవిందుఁడుకోని యూడిపిల్వఁగ వానిబ్రోచుటకు వచ్చితివని వేడ॥న॥

ముక్తిదానచణా- పూజితచరణా- భక్తపరాయణా భావనారాయణా॥

## (4) కాంభోది - మిశ్రగతి.

చారుశారదచంద్రికాకీర్తి। దళితాఖిల సుజనార్తి॥ చారు॥

సారసాక్షివిశాలహృదయ । యసారసంసరణాబ్ధితారక । మారకోటి సమానదివ్యా। నిగకరుణాసాగరా॥ చారు

రాజపూజితపాదసత్క్రమాలా। రవికోటిసన్నుత। తేజమంగళవిగ్రహోత్తమలా। భ్రాజమానగుణాలవాల విరాజితైకకృపాంబుధీని। ర్వ్యాజభక్తసురంగచరణ సరోజములమదిభక్తిఁగొల్చెద॥ చారు

అన్నిటివినీపోట్టనుంచుకొనీ। సతతానురాగత నెన్నివిధములనోధరించుకొని। చిన్నతనమనుమాటలేక ప్రసన్నహృదయుఁడవై చరించెదు। సన్నుతాంగా మొదలగు చిన్నజంతువులందునైనను॥ చారు

ఘోరదైత్యతిమిరమార్తాండా। పరిరక్షితాఖిల భూరిస్థావరజంగమాజాండా। సూరిసన్నుతభక్తనేత్ర చకోరచంద్రపురాణపూరుష। భారమాననుబ్రోచుటకుఁ గన్నారఁజూపుము నీస్వరూపము॥ చారు

కందమూలఫలానిలాహృతులై। నిరతంబునినుగో। వింద మాధవయందుసానతులై। యెందునున్నా వంచువనముల యందుఁజేరివిరాగులైముని। బృందము ల్వెదుకంగ బ్రహ్మానందపదవినొసంగిప్రోవవె॥ చారు

కావరంబునఁగన్నగానకయ। యెట్టుబ్రతిప్పినంజెదు త్రోవలందున బుద్ధిమానకయ। భావిగతనిరసించిపాపపు భావిలోఁబడియీాదులాడుచు శేషతేకాంచునామతి। భావనారాయణాభవత్కృప॥ చారు

## (౫) పూర్వకల్యాణి - చాపుతాళము.

దిక్కెవరుమమ్ముఁబ్రోవ దీనుల నజ్ఞానమతుల॥

అక్కటతోనీవుమమ్ము నాదరింపకున్న॥ ది।

పాపంబులఁబాఱఁదోలి పరమపద మొసంగుడెంచు। నాపేక్షనునున్న యట్టి యజ్ఞాలకమునీవుగాక॥ ది॥

ఆనయంబునుజీవరాసు లన్నియుఁబేలుగంగఁజూచి కనుపాటుగ నున్నయట్టి మునివంద్యుఁడనీవుగాక॥ ది॥

నిరతంబును నీదు పాద నీరజములఁ గొల్చి నీదు కరుణను బ్రాపింపఁ గోరు వరులకు నీ వెగతి గాక॥ ది॥

ధారాధర నీల దేహ దానవ సంహారభావ । నారాయణాయచ్యుతాయ । నాకనాథ నీవె గాక॥ ది॥

## (6) కాంభోది - త్రిపుటతాళము

ఎఱిఁగిన దొంగవని యేము నతిసేయ నిరసించుట యిదిలగునా॥ తండ్రీ॥

ధరమాకెల్లగురువు దాఁడియు దైవము గురుఁడు నీవే యని కొల్చి నభాగ్యమా॥ ఎ

పిలిచిన కొలఁదిని బెడ మొగము పెట్టు పెద్దలకిది న్యాయమా। కలిమిగలదు గాజ్య గరిమగలదటంచుఁ జాలుక ననే సెదవా మము ద్రోసెదవా॥ ఎఱి

నిన్ను నమ్మిన వారి నేటముంచుట నీకు। సన్నుతి యనుపించునా । కన్నకొడుకులఁ దండ్రి కడగండ్లఁ బెట్టుట। యెన్నడైన వింటిమా। ధర్మ గంటిమా॥ ఎఱి॥

ఆపద్బాంధవుఁడన్న యాధిక విఖ్యాతిని నందియుంటివి గాదా। నాంపార్తులై నీదు తనయులు ప్రార్థింప। ప్రాపు జూపకుందువా। పొమ్మందువా॥ ఎఱి॥

తప్పుఁ జేసినవారు దయఁ గోరుచుండఁగ। ముప్పుఁ బాపఁగ రాదా ఎప్పుడు మాకింక నీ బాధ తప్పుట। గొప్పవాఁడవు గాదా। మాతో వాదా॥ ఎఱి॥

చింతలఁ బాపి నీ చెంతఁ జేర్చుటకు శ్రీకాంతా వేళ గాదా । పంత మేలమాకో భావనాగాయా। యంతగమును జూడవా। కాపాడవా॥ ఎఱి

## (7)

ఎంతని పలికెద చింతఁ బాపఁగ శ్రీ। కాంతుఁడ నీతో పంతమ నాతో॥ ఎంత

కాంతుఁడవీవు సా। మంతుఁడవీ వభగ వంతుఁడవీ వెనా । శంతయు నీవె॥

చెంతఁ జేర్చుటకు నీ। వంతైయున్నది। వంతమాన్ప నభ్యంతర మెంచకు॥ ఎం

ఆపత్తారక ఆనుచయమారక। ప్రాపుగా వెనీ భక్తనికూరక॥ ఎంత॥